అంతముఖ్యము కాదు. ఈ భూమికలో నున్నవాడు దొరికినదానిని గూర్చి సంతసించడు. దొరకనిదానిని గూర్చి దుఃఖించడు. ప్రాప్తించిన దానితో తృప్తిపడుచుండును - 'రామా! నీవుకూడ తెలియదగిన తత్త్వమును తెలిసికొన్నావు. అన్నిటియందునూ వాసనలు క్షీణించినవి. నీకు నీవు సమాధిలో [illegible]. అథవా లోకసంగ్రహార్థమై లోకవ్యవహారమందైనను ఉండుము. హర్షశోకములను మాత్రము పొందకుము. పరిశుద్ధాత్మస్వరూపుడ వయిన నీకు సుఖదుఃఖము లెక్కడివి? అద్వితీయుడవయిన నీకు బంధువు లెవరు? అవినాశుడవగు నీకు వినాశమేమిటి? అమృత్యువుకు స్థానమయిన నీకు మృత్యువేమిటి! కుండపగిలి పెంకులు అయినంతమాత్రంచేత అందలి ఘటాకాశము నశించదు. నిరర్థకమయిన భ్రాంతిమాత్రం పుట్టుచున్నది నీకు. ఆత్మవ్యతిరిక్తమయిన వస్తువేదియు లేదు; సర్వశక్తియుక్తుడగు ఆత్మయందే అన్నిశక్తులును గలవు. మనస్సువల్ల తయారయిన ఈ ప్రపంచం మనోనాశమయితే నశిస్తుంది. సంసారమనే యంత్రమును నడపుచున్న వాసన అనే రజ్జువును (రబ్బరు పట్టాను) పురుషప్రయత్నంచేత తెగగొట్టును. నీవు తత్త్వం తెలుసుకోకపోతే మహామోసం చేస్తుంది ఇది. నీవు తత్త్వం తెలుసుకొంటివా, బ్రహ్మసుఖాన్ని ఇస్తుంది. ఈ మాయ బ్రహ్మమునుండి వచ్చింది. లీలామాత్రంచేత సంసారమును అనుభవించింది - మళ్ళీ బ్రహ్మను స్మరించింది. సంసారాన్ని నాశనం చేసింది. తాను మళ్లీ బ్రహ్మతో లయిస్తోంది. రామా! నీరూపుడూ, అప్రమేయుడూ, నిరామయుడూ అయిన పరశివునినుండి సకలభూతములు పుట్టుచున్నవి. అగ్నివల్ల వెలుతురు పుట్టినట్లే. ఆకులో సన్నని రేఖలూ, నీటిలో తరంగములూ, బంగారమునందు కటకాదులూ, అగ్నియందు వేడి వెలుతుర్లూ, ఎట్లో- అట్లే. వాసనావచ్ఛిన్నమయిన బ్రహ్మయందు ఈముల్లోకములూ ఉన్నవి. అతనినుంచి పుట్టినవి. అరూపముతోనే ఉన్నవి. అతడే సర్వభూతములకు ఆత్మరూపుడు. అతడే బ్రహ్మ. అతడు తెలిసినచో ప్రపంచమంతా తెలియును. భువనత్రయమందును అతడొక్కడే జ్ఞాత. శాస్త్రమునందు వ్యవహరించుటకుగాను సర్వవ్యాపకమయిన పరమాత్మకు చిత్తు అనీ, బ్రహ్మ అనీ, ఆత్మ అనీ నామములు

శాస్త్రకర్తలచే కల్పింపబడినవి. ఇష్టానిష్టవస్తువులకు ఇంద్రియములతో సంబంధము కలిగినపుడు హర్షామర్షములులేని శుద్ధచైతన్యమే ఆత్మ. ఆకాశముకంటె మిక్కిలి స్వచ్ఛమయిన ఈచిదాత్మయందు ఈప్రపంచము తనలోనే తనకంటె వేరుగ నున్నట్లు ప్రతిబింబించుచున్నది. ప్రపంచమూ, ప్రపంచమను జ్ఞానమూ, తత్ప్రయుక్తములయిన లోభమోహాదులూ నిజంలో లేనివయియే, ఆచిదాత్మయందు వేరువేరుగ ప్రతిబింబించినవి. పరమార్థంలో అవి అన్నీ ఆత్మరూపములే – అద్దమునందు కనిపించెడి పర్వత వన నద్యాదులు అద్దముకంటె నిజంలో భిన్నములు కావు. కనుక రామా! శరీరరహితుడవై, నిర్వికల్ప చిదాకారుడవగు నీకు లజ్జాభయవిషాదాదులవల్ల మోహమేల? దేహము లేని నీవు దేహమువల్ల బుట్టిన లజ్జాదివికల్పములచేత, మూఢునివలె తిరస్కరింపబడుట ఏల? అఖండ చిన్మాత్రుడయిన ఆత్మయొక్క దేహము కోసి ముక్కలుచేస్తే అజ్ఞానియగు ఆత్మకే నాశము (చావు) లేదే? ఇంక జ్ఞాని కేముండును? ఎక్కడా రాకపోకలకు అడ్డులేని చిత్తమే శరీరమునందుండి పురుషు డనబడుతోంది. అంతేకాని శరీరముకాదు పురుషుడు–శరీరము ఉన్ననూ, లేకున్ననూ, చిత్తను అనే పురుషుడుమాత్రము జగత్రయమందు జ్ఞానిగానో అజ్ఞానిగానో ఉన్నాడు. దేహము నశించినా ఆపురుషుడు నశించడు. మన మనుభవించెడి చిత్రవిచిత్రములయిన దుఃఖములన్నీ దేహమునకూ దేహమునందలి చిత్తమను పురుషునకూగాని చిదాత్మకు గావు. మనోమార్గమునకు గోచరముకానందున ఏచిత్పదార్థము శూన్యమువలె (లేనిదివలె) నున్నదో అట్టి చిత్పదార్థము సుఖదుఃఖములచే ఎట్లు వ్యాప్తమగును? – ఈజీవుడు నశించిన దేహపంజరమునుండి లేచి, దానియం దభిమానమును విడచి, తనకు అధిష్ఠానమయిన పరమాత్మను పొందుతున్నాడు. "మనఃప్రాణే ప్రాణస్తేజసి తేజఃపరస్యాం దేవతాయాం" అను శ్రుతి యిందు ప్రమాణము. – పద్మమునుండి తుమ్మెద లేచి ఆకాశమును చేరినట్లే– కాని భేదవాసనలకు మూలమైన అజ్ఞానాన్ని పోగొట్టే జ్ఞానం కలగనందున ముక్తుడగుట లేదు. రామా! ఒకవేళ నీవు జీవుడు ప్రతిబింబరూపుడనీ, ప్రతిబింబానికి ఉపాధికంటె వేరుగ ఉనికి లేదనీ, అందువల్ల ప్రతిబింబరూపుడగు

జీవుడు ఉపాధినాశంవల్ల నశిస్తాడనీ అనుకున్నా, దేహనాశంవల్ల నీకు దుఃఖము అవసరము లేదు. జీవునకు అంతఃకరణము ఉపాధి కాని స్థూల దేహము ఉపాధి కాదు. అంతఃకరణమునందు ప్రతిఫలించినదికాని, చైతన్యము స్థూలదేహమునందు ప్రతిబింబించలేదు. అందువల్ల స్థూలదేహము నశించినందువల్ల జీవునకు నాశము లేదు. కనుక దేహ నాశమును అనుసరించి దుఃఖింప పనిలేదు. అథవా – నీవు జీవుడవు కావు. పరమాత్మవు కనుక ఉపాధినాశంవల్ల జీవుడు పోయినందున నీకు పోయిన దేమీ లేదు. నిజస్థితిలో ప్రతిబింబము బింబమేకాని బింబముకంటె వేరుకాదు. బింబమే ఉపాధిలో ప్రవేశించినట్లునూ, భిన్నమయినట్లునూ కల్పించుకొని ప్రతిబింబమును గ్రహించుచు న్నారు. ఇట్లు చిదాభాసుడు బింబరూపుడుకాక, జడమయిన ఉపాధి యొక్క కార్యమే అయినచో ఇతడుకూడ జడమే యగునుకాన, ఇతనికి సంసారభానమూ, సుఖదుఃఖానుభవమూ ఉండేదికాదు. అందుచేత నీవు ఉపాధిని విడిచి, జీవుడు సత్యమయిన బ్రహ్మ అనియే భావించుము. భ్రాంతి కల్పితమయిన దేహాదిభావమును భావింప కుము. దేహాదులు నశ్వరములు, అసద్రూపములు, పరిపూర్ణ బ్రహ్మ రూపుడనయిన నీకు ఏవిధమయిన కోరికయు లేదు. సాక్షిమాత్ర మయిన నిరీక్షచ్చిదాత్మయందు లోకములు అద్దమునందు ముఖా దులవలె కోరకున్ననూ ప్రతిఫలించినవి. మణియందు కిరణములు కనిపించినట్లు సాక్షిచైతన్యమునందు లోకములు కనిపించుచున్నవి. అద్దానికీ బింబానికీ కోరికలేకున్నా సంబంధ మెట్లు కలదో, ఆత్మజగ త్తులకుగూడ అట్లే సంబంధము. సూర్యుడిసాన్నిధ్యమాత్రంచేత లోకవ్యవహారములు జరుగుచున్నట్లు చిత్సత్తామాత్రంచేత ప్రపంచం తయారవుతోంది. కనుక రామా! నేను చెప్పిన ఉపదేశక్రమంచేత ప్రపంచమునకు మూర్తమగు ఆకారము ఎగిరిపోయింది. ప్రపంచస్థితి అంతా ఆకాశమయింది (శూన్యమయింది). ఓ ఇతరసభ్యులారా! మీచిత్తమునందుకూడ ఇదే విషయమును భావించుడు. దీపము ఉన్నంతమాత్రంచేత వెలుతురు సహజంగా ప్రసరించినట్లు, చిత్త త్వము ఉన్నంతమాత్రంచేత స్వభావతః ప్రపంచస్థితి నెరవేరుతోంది. రామా! పరమాత్మతత్త్వమునుండి మొదట మనస్సు పుట్టింది.

తరువాత వికల్పజాలముతో సహా ప్రపంచం పుట్టింది. శూన్యమయిన
ఆకాశమునందు శూన్యమయిన నీలత్వము లోకవాడుకలో గోచరించి
నట్లుంది మనస్సువల్ల ఈజగత్తు పుట్టడము. - కనుక నే సంకల్పములు
నశిస్తే చిత్తం నశిస్తుంది. చిత్తం నశిస్తే సంసారమోహామనే
మంచుబిందువులు ఎగిరిపోతాయి. అపుడు శరత్కాలంవస్తే ఆకాశం
నిర్మలంగా ఉన్నట్లు అజరామరము, అద్వితీయము అగు బ్రహ్మ
మాత్రము ఒక్కటే ప్రకాశిస్తుంది. సకలప్రాణికర్మసమష్ట్యాత్మకము,
సమిష్టిక్రియాశక్తిప్రధానము అగు మనస్సు మొట్టమొదట పుట్టుచు
న్నది. తరువాత దానియందు చిత్తు ప్రతిబింబించుటవలన హిరణ్య
గర్భ బ్రహ్మ మన్వాది ప్రజాపతులు మున్నగు సృష్టికర్తల శరీర
ములు పుట్టుచున్నవి. ఆపైన ఈమిథ్యాప్రపంచం అంతా తయారవు
తోంది. కనుక దృశ్యమయిన ప్రపంచం అంతా వ్యష్టిసమిష్టిభేద
ముచే కల్పితమై మనోమాత్రమేకాని అంతకంటె వేరుకాదు.
ఆమనస్సు అసమాప్రమయిన అజ్ఞానముయొక్క కార్యము. ఆ అజ్ఞా
నము అధిష్ఠాన సాక్షిచైతన్యముయొక్క సత్తాస్ఫూర్తివల్ల స్ఫురి
స్తోంది. కనుక ఈ క్రమంగా బ్రహ్మయే జగజ్జన్మాదులకు వివర్తో
పాదానకారణ మని తేలినది. కాబట్టి రామా! నిష్ప్రపంచ సచ్చిదా
నందైకరస పూర్ణబ్రహ్మమే పరమార్థము. మిగిలిన ప్రపంచమంతా
మిథ్య, కల్పితము. ఇదియే సకల సృష్టిశ్రుతులకూ తాత్పర్యార్థము-
అన్నారు వసిష్ఠులు.

౧౨౨వ సర్గ సమాప్తము.

—♦ ఇట్లు ఉత్పత్తిప్రకరణము సమాప్తము ♦—

ఆంధ్రవాసిష్ఠరామాయణమునందు వైరాగ్య, ముముక్షు, ఉత్పత్తి
ప్రకరణములుగల ప్రథమభాగము సమాప్తము.

—♦ ఓమ్ శివమ్ ♦—

